సంబంధించినదనియు చెప్పుదురు. రాణాయణీయములో ఉచ్చారణభేదము గోచరించును. కౌథమిలో హా ఉ, రా ఇ అని ఉచ్చరించినవి ఇందులో హా వూ, రా యీ అని ఉచ్చరింపబడును. సౌత్యాముగ్రిశాఖ దీని అవాంతరశాఖ. దీనిలో హ్రస్వ ఎ ఒ అక్షరములు వినిపించును. జైమినీయ సంహితలో కౌథుమీయ సంహితలోకన్న మంత్రములు తక్కువగా నున్నను గానములు ఎక్కువగా కనిపించును. తలవకారశాఖ దీనికి అవాంతరశాఖ. కేనోపనిషత్తు ఈ శాఖకు సంబంధించును.

సామసంహితలన్నియు, ఆర్చికము లనియు, గానము లనియు రెండు విధములు. ఋక్కులకే ఆర్చికములని పేరు. కాగా, ఆర్చికములలో సామగానమున కుపకరించు మంత్రములన్నియు సంగ్రహింపబడినవనియు, గానసంహితలో అవేమంత్రములు గేయరూపములో సంతరింపబడినవనియు తెలియునగును. సామగానము 4 విధములు. (1) గ్రామగేయగానము. ఇది గ్రామములో పాడదగినది. దీనిని వేయగానమనికూడ పేర్కొందురు. (2) అరణ్యగేయగానము. ఇది అరణ్యములో పాడదగినది. గ్రామగేయ, అరణ్యగేయములకు ప్రకృతిగానము లని వ్యవహారము. వీని ననుసరించి (3) ఊహగానము, (4) ఊహ్యగానము అనునవి వికసించును. మొదటిరెండును పూర్వార్చికమునకును, చివరిరెండును ఉత్తరార్చికమునకు సంబంధించును. సామగానవిధానము ఉత్తరార్చికములో కొంత వివరింపబడినది. ఋక్ ప్రాతిశాఖ్య, తైత్తిరీయ బ్రాహ్మణ, సామవిధాన బ్రాహ్మణ, పుష్పసూత్ర, సామసూత్ర, నారదశిక్షాదులలో మరికొంత విస్తారముగా ఈ విషయము వర్ణింపబడినది.

నారదీయశిక్షలో సామస్వరములు 7 చెప్పబడినవి. అట్లే 3 గ్రామములు, 21 మూర్ఛనలు, 49 తానములు పేర్కొనబడినవి. సామసప్త స్వరములు. వేణువులో వరుసగా 'మ గ రి స ని ధ ప' అను స్వరములకు సరిపోవును. సామగాన పాఠములలో స్వరములు 1 నుండి 7 వరకు అంకెలువేసి చూపబడును. ఉచ్చైస్తారమను స్వరము 11 అంకెతో చూప బడును. సామమంత్రములలో స్వరచిహ్నములుంచు పద్ధతి దీనికి భిన్నము.

గానభాగములో సంగీతానుకూలముగ చేసిన మార్పులు సామవికారములని పిలువబడును. అవి ఈ క్రిందిపద్ధతిలో ఆరు విధములుగా నుండును.

(1) వికారము - 'అగ్నే' అనుటకు బదులు 'ఓగ్నాయి' అనుట.

(2) విశ్లేషణము - 'వీతయే' అనుటకు 'వో. యితోయాఽయి' అనుట.

(3) వికర్షణము - 'యే' అనుదానిని 'యా 2, 3, యి, అని పొడిగించుట.

(4) అభ్యాసము - 'తయే' అనుచోట 'తోయాయి, తోయాయి' అని రెండు సార్లు పలుకుట.

(5) విరామము - 'గృణానో హవ్యదాతయే' అను పదమును 'గృణా నోహ, వ్యదాతయే' అని విరిచి చదువుట.

(6) స్తోభము - ఔ, హోవా, హోవు, అ, మున్నగునవి ఊతపదము లుగా చేర్చిపాడుట.

సామగానములో పదములు విరిచి చదువునప్పుడు ఛందస్సుగాని, అర్థముగాని గమనింపరు. 'సామవేదే గీతి ప్రధానే అవృత్తిస్వర్థో నాద్రియతే' అని సామగాన ప్రసంగములో అర్థముతో నిమిత్తములేదని స్పష్టముగా చెప్ప బడినది. ఛాందోగ్యములో సామగానము హింకార, ప్రస్తావ, అది, ఉద్గీథ, ప్రతిహార, ఉపద్రవ, నిధనభాగములు కలదిగా చెప్పబడినది. హింకారము ఓంకారతుల్యము. ప్రస్తావమనునది ఆరంభగానము. దీనిని ఋత్విజు డారంభించును. ఉద్గీథ ఓంకారము. దీనిని ఉద్గాత పఠించును. ప్రతిహారమనగా రెండింటిని కలుపునది యని అర్థము. దీనిని ప్రతిహర్త చదువును. ఒకప్పుడిది రెండుగా విరిచి చదువుదురు. అందొక భాగమునకు ఉపద్రవమని పేరు. దీనిని ఉద్గాతగానము చేయును. నిధన మనునది మంత్రములోని అంతిమభాగము ఓంకారము. దీనిని ఋత్విజులు, ప్రస్తోత, ఉద్గాత, ప్రతిహర్త ముగ్గురు చదువుదరు. 'అగ్నఆ యాహివీతయే' ఇత్యాదిగా గల మంత్రము పైవిధముగా గానము చేసినప్పుడు ఈ క్రింద చూపిన విభాగపద్ధతిలో గోచరించును.

ఓం అగ్నఇ. (ప్రస్తావము).
ఓం ఆయాహివీతయే, గృణానోహ వ్యదాతయే. (ఉద్గీథ)
నిహోతా పత్సిబర్హిషి ఓం. (ప్రతిహారము).
నిహోతా పత్సిబ. (ఉపద్రవము).
ర్హిషిఓం. (నిధనము).

ప్రతి మంత్రమును మూడుసార్లు చదివి గానముచేసి పూర్తిచేయుదురు. ఈ గానములో కృష్ణ, ప్రథమా, ద్వితీయా, చతుర్థీ, మంద, అతిస్వార్థ అను లయలు పాటింపబడును. దుందుభి, వేణువు, వీణ వంటి వాద్యములు కూడ ఉపయోగింతురు. ప్రతిఛందమును సానుకూలముగా మార్చి గానము చేయబడును. కాని సంహితలో ఉన్న మంత్రము లన్నిటికి గానము చెప్పబడ లేదు. యజ్ఞములో హోత గానము లేని కేవల మంత్రములు చదివి, ఆయా దేవతలను స్తుతించును. 'అప్రగీతమంత్రసాధ్యా స్తుతిః శస్త్రం' అని ఈ విధమైన (గానములేని) మంత్రస్తుతిని శస్త్రమును పేర వ్యవహరింతురు. 'ప్రగీతమంత్రసాధ్యా స్తుతిః స్తోత్రం' అని గానయుక్తమైన మంత్రస్తుతిని స్తోత్రమందురు. దీనిని ఉద్గాత గానము చేయును. స్తోమములను పేర స్తుతిభేదములు 6 వరకు చెప్పబడినవి. త్రివృత్ పంచదశాదులైన యీ స్తోమములు తృచ (మూడేసి మంత్రములుగల సూక్తము) మీద ఏర్ప డును. తృచను మూడుసార్లు చదివి ప్రతిపర్యాయమును సామగానమును ఆవృత్తి చేయుచుందురు. ఈ విధముగా ఆవృత్తి చేసినగానము విష్టుతి (విశేషస్తుతి) అని పిలువబడును. సామగానములో ఉద్గాతకు ప్రస్తోత, ప్రతిహర్త్రాదులు సహాయకులుగా వ్యవహరింతురు. స్తోభగానమునకు వేరే సహాయకులుందురు.

నాలుగు వేదములకు నాలుగు ఉపవేదము లున్నవి. "తత్రర్గ్వేదస్య ఆయుర్వేద ఉపవేదః, యజుర్వేదస్య ధనుర్వేదః, సామవేదస్య గాంధర్వవేదః అథర్వవేదస్య శస్త్రశాస్త్రాణి" ఇత్యాది వచనముల ననుసరించి సామవేదము నకు గాంధర్వము ఉపవేదముగా చెప్పబడును. గాంధర్వమనగా గానకళ. ఛాందోగ్యములో ఘోర అంగిరసుడను ఋషి దేవకీపుత్రుడైన శ్రీకృష్ణునికి

వేదాంతవిద్య ఉపదేశించినట్లు చెప్పబడినది. శ్రీకృష్ణుడీవిద్య నుపాసించి చాలిక్యగానమును వెలయించెననియు, అది యాదవులలో ప్రచారమందిన దనియు, మురళిపై కృష్ణుడీ గానమునే వినిపించెడివాడనియు చెప్పుదురు. ఏది ఎట్లున్నను సామవేదము గానకళకు మూలమనుట తథ్యము. సామ సప్తస్వరములకు వేణువుపై నూదబడు స్వరస్థాయీ విన్యాసముతో గల పోలికలు నారదీయశిక్షాదులలో వివరింపబడినవని ముందు వ్రాసితిని. కాని నేడు సామగానము చేయుపద్ధతిలో ఈ స్వరములు సుస్పష్టముగా తెలియవు. శాస్త్రమునకును వ్యవహారమునకును కొంత ఎడమున్నట్లున్నను, అది సంప్రదాయభేద మూలకమని అంగీకరించి వ్యవహారమే బలీయ మని చెప్పుదురు.

యజ్ఞములో సోమపానమెంత రుచ్యమో సామగాన మంత మధురము. దేవతాస్తోత్రపరముగా ఆ యా సామములు గొంతెత్తి పాడుచున్నప్పుడు ఉద్గాత్రాది ఋత్విజుల ఉత్సాహము సభికులకునుకూడ ఉత్సాహపరచుచుండును. ఒకానొక రసాత్మకమైన వాతావరణము యాగశాలయం దంతటను నెలకొనును. ఈ గానరసమునకు సోమరసము చేయూత ఇచ్చినట్లుండును. యజ్ఞములో సోమాహరణాది ప్రసంగములు చాల రసవంతములు. సోమమనునది ఒక లత. ఋగ్వేదములో ఈ లత మూజవానపర్వత ప్రాంతమునను కురుక్షేత్రములోని శర్యణావత్ ప్రదేశములలోను దొరకునని చెప్పబడినది. ఇది నదీతీరములలో నాచువలె పెరుగునట. పర్వత ప్రాంతములలో లతవలె పెరుగునట. దీనికి పర్వతావృధ, గిరిష్ఠ మున్నగు పేర్లు చెప్పబడినవి. చంద్రునితో సామ్యముచెప్పి చంద్రకళలతో పాటు పెరుగుచు తరుగుచునుండు ఆకులు గలదిగా వర్ణింపబడినది. కొందరిది అరటిదుంపవంటి దుంప అనియు, లతగా ప్రాకుననియు, నీటిలో తేలుననియు, దీనికి 15 ఆకులుండు ననియు, అధర్మపరుల కిది కనబడదనియు చెప్పుదురు. నిజమునకిది యీనాడు కనబడదు. ఆపస్తంబునినాటికే ఈ లత దేశములో మృగ్యమైనట్లున్నది. అతడే దీనికి అనుకల్పములు చెప్పెను. ఈ అనుకల్ప విధి

ననుసరించి యీనాటి యజ్ఞములలో సోమలతకు మారుగా కారుగచ్చనో తిప్పతీగెనో వాడుదురు.

సోమయాగములలో సోమాహరణమే ఒక పెద్ద కలాపము. సోమాహరణ సూక్తములకు సౌపర్ణసూక్తములని పేరు. సోమలతను అధ్వర్యుడును యజమానియు కొందురు. దానిని 36 అంగుళములపొడవు, 18 అంగుళముల వెడల్పు గల అభిషవణఫలకముమీద కృష్ణాజినము పరచి, దానిపై నుంచెదరు. ఆ మీద దాని నభిమంత్రించుచు నీటితో తడుపుచు నాలుగు శిలాయంత్రములతో నూరుదురు. తరువాత దానిని ఆహవనీయపాత్రలో వేసి నీరు ఓడ్చి లతను పిండి నీళ్ళలో కలుపుదురు. కసవుతీసిన లతకు 'ఋజీష' అనిపేరు. దీనిని దశాపవిత్ర వస్త్రములో మూటగట్టినట్లు కట్టి రసము ధారగా పడునట్లు పడియగట్టుదురు. ఈ విధముగా పిండినరసము ముందు దేవతలకిచ్చి హోమముచేసి వషట్కారములు చెప్పుదురు. ఆ మీద హోమావశేషమును ఉద్గాత, యజమాని, బ్రహ్మ, సహస్రకుదు గ్రహింతురు. ఆ యా దేవతల కర్పించునపుడు సోమరసమును పాలు, పెరుగు, నేయి, సువర్ణరజము మున్నగువానితో కలిపి అర్పించెదరు. యజ్ఞదినములలో ఈ కలాపము దినమునకు మూడుసారులు జరుపుదురు. సోమరసమును మధువనీ, మధుమత్ అనీ, పీయూషమనీ వ్యవహరింతురు. ఆయా వస్తువులు కలిపినపుడు దీనిని ఆశిర, గవాశిర, యవాశిర మున్నగు పేర్లతో వ్యవహరింతురు.

సుశ్రుతములో సోమరస భేదములు ఇరువది నాలుగు వరకు వేదోక్తములుగా వర్ణింపబడినవి. ఇది సువర్ణపాత్రలో త్రాగవలసినదిగా చెప్పబడినది. దీనివలన హర్షోత్సాహములేకాదు బ్రహ్మజ్ఞానోదయమున కనుకూలించు స్వస్థత కలుగునని వివరింపబడినది. ఇది అమృతము. విశుద్ధ బుద్ధియు నిర్మల జ్ఞానమును దీని ఫలములు, సురదుర్మద. అది నిందనీయము. సౌత్రామణి వంటి యాగములలో సురాప్రయోగముకూడ విధించబడినను, సురకన్న సోమముత్కృష్టమనియు, అది మత్తు కలిగించుననియు, ఇది చిత్తస్వాస్థ్యమిచ్చుననియు తెలియజేయు మంత్రములు ఋగ్వేదములో పలుచోట్ల

కన్పించును. పైగా ఆధ్యాత్మికముగా అర్థము వివరించునపుడు సోమరస మునకు నిర్మలజ్ఞానము, బ్రహ్మానందరసము మున్నగు సాంకేతికార్థములు గ్రహింతురు.

సామవేదము ముఖ్యముగా యజ్ఞప్రయోగమునకే ఏర్పడినట్లుండును. దీని మంత్రములన్నియు ఋగ్వేదమునుండి గ్రహించినవే. గానమే దీని సొంతము. అయినను ఆగానము ప్రణవనిర్భరమై తత్పరిణామమై తదేకాలంబనమై వెలయు చుండుటచేత సామము సర్వోత్కృష్టమైన విద్యగా భావింపబడుచున్నది. ఛాందోగ్యమున సామసారమగు ఉద్గీథవిద్య, ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతిక, సంపదలకు మెరుగు సమకూర్చునదిగా వర్ణింపబడినది. సోమయాగములో సోమదేవతాకమైన మంత్రము లెన్నియో సామవిధానము ననుసరించి గానముచేయబడును. బహిష్పవమానాది సూక్తములవంటి (ఋత్విజులందరు సామూహికముగా గానము చేయునట్టి) ప్రసంగము లీ యజ్ఞములలోవలె దర్శ, పూర్ణమాసాదులలో కలుగవు. ఇట్లే యజమాని కీష్టకామ్యార్థము లొనగూర్చుటకై, ఆ యా దేవతల నుద్దేశించి తత్తత్ స్తుతిపరములైన సూక్తములు గానముచేయుదురు. ఒకొక్క దేవత కొకొక్క విధమైన స్తోభాక్షరములు ప్రయోగించుదురు. గానముచేయు ఋత్విగ్విభేదము ననుసరించి యిట్టి సామస్తోత్రములను ప్రస్తావభక్తి, ఉద్గీథభక్తి, ప్రతిహారభక్తి అనికూడ వ్యవహరింతురు. సామము దేవతలకు ప్రియమైనది. లోకవ్యవహారములో కూడ సామమనగా ప్రియముపలుకుట, నయము సమకూర్చుట అనియే అర్థము. శ్రుతి కూడ 'యత్ ఖలు సాధు తత్ సామ' అని ఏది సాధువో అనగా ఏది శుభావహమో శోభనమో అదియే సామమని కీర్తించినది.

* * * *

# అథర్వవేద సంహితలు

వేద చతుష్టములో అంతిమము అథర్వవేదము. ఇది ఆముష్మికముతో పాటు ఐహికమునకు కూడ సమప్రాధాన్యమిచ్చునట్టి వేదము. థర్వశబ్ద మునకు కుటిలత అని అర్థము. అ కుటిలమై, సహజమై ఐహికాముష్మి కోపయోగియైన ప్రవృత్తి నుద్బోధించుటచేత ఈ వేదమునకు అథర్వవేద మని పేరువచ్చునది. పరబ్రహ్మప్రాప్తి కిది ఋజుమార్గము నెరింగించును. యజ్ఞములలో ఇది బ్రహ్మగారి వేదము. శాంతి పౌష్టిక క్రియల కిది మూలము. దీనిని అథర్వాంగిరసులు దర్శించిరట. ఆ కారణమున దీనికి అథర్వాంగిరసమని వేరొక పేరు. అట్లే భృగ్వాంగిరసమని కూడ దీనిని వ్యవహరింతురు.[1] భృగువు అంగిరసుని శిష్యుడట, గోపథ బ్రాహ్మణములో ఆ యీ పేర్లతోపాటు దీనికి బ్రహ్మవేదమను పేరుకూడ చెప్పబడినది.[2]

వేదవ్యాసుని శిష్యులలో సుమంతు డనునాత డీ వేదము నభ్యసిం చెను.[3] అతని శిష్య ప్రశిష్యులచే ప్రచారమునకు వచ్చి ఈ వేదము తొమ్మిది శాఖలుగా విస్తరించెను. కాని యీనాడు మన కీ వేదమునకు సంబంధించినవి శౌనక, పిప్పలాదశాఖలు రెండుమాత్రమే మిగిలినవి. పిప్పలాద సంహిత ఒకే ఒక ప్రతి కాశ్మీరములో లభించినది. అదికూడ అసమగ్రము. పిప్పలా దునిప్రశంస ప్రశ్నోపనిషత్తులో కనిపించును. ఈ శాఖకు ఇరువది కాండలు కలవనియు దీని బ్రాహ్మణము ఎనిమిది అధ్యాయముల గ్రంథమనియును తెలియుచున్నది. కాగా ప్రచారములోనున్న శాఖ శౌనకశాఖమాత్రమే.

శౌనకశాఖీయులైన బ్రాహ్మణులు గుజరాతు మహారాష్ట్ర ప్రాంతము లలో ఉన్నట్లు తెలియుచున్నది. గోపథ బ్రాహ్మణ మీ శౌనక సంహితకే సంబంధించును. శౌనకసంహిత 20కాండలు 732 సూక్తములు 5987 మంత్రములు కలిగి మంత్రసూక్తములన్నియు ఒక నిర్ణీతమైన క్రమములో

---

[1] అథ. 10-7-20.

[2] గోపథ. బ్రాహ్మ. 2-16.

[3] అథర్వాంగిరసామాసీత్ సుమంతుర్దారుణోమునిః. భాగ. 1-4-21.

సంగ్రహించినట్లు కాన్పించును. ఇందులో 1200 వరకు ఋగ్వేద మంత్రములే తిరిగి విన్పించును. సోమయాగమునకు ఉపకరించు మంత్రములెన్నియో దీనిలో చేర్చబడినవి. ఇరువదియవ కాండలో ప్రసిద్ధమైన సంతాపసూక్తము గోచరించును. 'కుమం నామ కుత్సితం భవతి యత్ తత్ తపతి తస్మాత్ కుంతాపః' అని యీ సూక్తము సమస్త కుత్సితాపహారకమని చెప్పబడినది.[4] యజ్ఞములలో ఈ సూక్తమును విధిగా పఠింతురు. దీనిలో పరిషత్తు రాజు మున్నగువాని ప్రశంసలెన్నో వినిపించును. కొందరీ వేదమును క్షత్రవేదమనికూడ పిలుతురు. సంగ్రామము, శత్రుజయము, రాజవారణము, అభిషేకము, దుందుభివంటి వాద్యాలప్రశంస, వాటి స్తోత్రాలు మున్నగు విషయాలెన్నో క్షత్ర ధర్మ రాజకర్మలకు సంబధించినవి ఈ వేదములో వర్ణింప బడినవి. రాష్ట్రీయ భావములెన్నోచోట్ల వెల్లడింపబడినవి. పృథ్వీసూక్తములో భూదేవిని మాతృరూపములో దర్శించి తద్వాత్సల్య మాశింపబడినది.[5]

అథర్వసంహితలో ఆరంభకాండలు తొమ్మిదింటివరకు ఎన్నో, భైషజ్య సూక్తాలతో నిండి కనిపించును. వీనిలో శ్వేతకుష్ఠ, పలితరోగము. శీతజ్వరముకాన శ్వాస శ్లేష్మరోగములు, బాలగ్రహ పీడలు, రాజయక్ష్మవంటి మహావ్యాధులెన్నిటికో మంత్ర తంత్రౌషధ ప్రకియలు వర్ణింపబడినవి. దీనిలో రోగ నిదానముకూడ చెప్పబడినది. జ్వరము ఋతుసంబంధియని, క్రిములు రోగ వ్యాప్తికి మూలమని, సూర్యకిరణ ప్రసారమారోగ్య వర్ధకమని, విషస్య విషమౌషధ మ్మను మాట సత్యమని, ఓషధులతోపాటు మణులు మంత్ర ములుకూడ రోగాపహారులని వర్ణించిన ఆయా సూక్తములు శస్త్రచికిత్స, శల్యచికిత్స, దంత నేత్రనాసికాచికిత్సలకు ప్రత్యేకముగా సంబంధించినవి. రోగనివారణమకు వలెనే శత్రు, గ్రహ, భూత, ప్రేత పిశాచ పీడానివార ణకుకూడ ఈ వేదము మంత్ర తంత్ర, ఆభిచారిక క్రియాకలాపము లెన్నో సూచించును.

---

4 ఐత, బ్రాహ్మ. 6-32 : కౌషీ. బ్రాహ్మ. 30-5.

5 మాతాభూమిః పుత్రోఽహం పృథివ్యాః సా నో భూమిర్విసృజతాం మాతా పుత్రాయ మే పయః (12-2-12).

ఔషధప్రక్రియలు, ఆభిచారిక తంత్రములు మాత్రమేకాక శాంతి పౌష్టిక క్రియలు, రక్షాసూత్రధారణాదులు, ఉపనయన చౌలాదిసంస్కారములు, హల కర్మ, బీజావాపనము, వృష్టి వాణిజ్యము మున్నగున వెన్నో యీ వేదములో వర్ణింపబడినవి. జ్ఞాతాజ్ఞాతదోష నివృత్తి కాచరింపవలసిన ప్రాయశ్చిత్తాలు, ఆనాటి శకునాలు, ఆచారవిశ్వాసాలు మున్నగున వెన్నో ఈ వేదమువలన తెలియును, ఇంతగా ఈ ప్రక్రియలు వివరించినందుననే రాజపురోహితుల కీ వేదము విధిగా తెలిసి యుండవలెనని చెప్పబడినది. దేశశాంతికి, రాష్ట్ర రక్షణకు, రాజ్యాభివృద్ధికి, రాజహితమునకు వలసిన శాంతి, పౌష్టికక్రియలు యథావిధిగా నిర్వహింపదగిన వాడే రాజపురోహితుడుగా నుండదగునని దీని భావము. తదనుకూలముగనే రాష్ట్రీయత, సామ్రాజ్య నిర్మాణము, తద్రక్షణము, రాజసూయమువంటి వాని ప్రశంసలెన్నో ఈ వేదములో గోచ రించును. అట్లే యీ వేదము 12 వ కాండములో పృథ్వీసూక్త మున్నది. ఇది దేశభక్తి ప్రపూర్ణమైన సూక్తము. దేశము, రాష్ట్రము, సమాజము అను నవేకాక గృహము, భూమి, పశుసంపద మున్నగునవికూడ ఈ వేదములో సమాన ప్రాధాన్యముతో వర్ణింపబడినవి. గో సూక్తములో గోవులు, వాని మాహాత్మ్యము వివరింపబడినది. గోవులెల్లరకు వరణీయములని చెప్పి,

"వశామేనా మృతమాహుః వశాం మృత్యుముపాసతే,
వశేదం సర్వమభవత్ దేవా మనుష్యా అసురాః పితరర్షయః.[6]

అని వశాగౌసూక్తములో వర్ణింపబడినది.

ఇట్లే స్త్రీలను గూర్చి చెప్పిన సూక్తములలో పతిప్రేమ, పుత్రప్రాప్తి, పుత్రరక్షణము, సపత్నీవిజయము మున్నగు విషయములతోపాటు వశీకర ణము మోహనము, మారణమువంటి తంత్రములుకూడ వర్ణింపబడినవి. ఈ విషయములు కొన్ని యీనాటి నాగరకతకు రుచింపవు. ఆ యీ విధమైన ఆభిచారిక మంత్ర తంత్రములుండుటచేత కొందరీ వేద మార్యానార్య సంస్కృతి సమ్మేళమునకు ఫలితముగా వికసించినదని చెప్పుదురు.

6 అథ.

మరికొందరిది రచనలో అర్వాచీనమైనను వర్ణ్యవిషయములనుబట్టి ఋగ్వేదముకంటె ప్రాచీనమైన నాగరికతకు సంబంధించినదిగా చెప్పుదురు. కాని స్త్రీలను గౌరవించుటలోగాని వారికి గృహస్థాశ్రమములో తగినంత ప్రాధాన్యమిచ్చుటలోగాని ఈ వేదము ఋగ్వేదమున కేమాత్రము తీసి పోదు. ఆడుబిడ్డకు కన్యాధనమిచ్చి అత్తవారింటి కంపుచు చేయునట్టి ఉపదేశములో--

"యథా సింధుర్నదీనాం సామ్రాజ్యం సుషవే వృషా
ఏవా త్వం సమ్రాజ్యేఽధి పత్యురస్తం పరేత్య చ"[7]

అనిచెప్పిన వాక్యములు 'సమ్రాజ్ఞీ శ్వశురో భవ, సమ్రాజ్ఞీ శ్వశ్రునాం భవం'[8] ఇత్యాదిగా చెప్పిన ఋగ్వేదమంత్రమును జ్ఞప్తికి తెచ్చినట్లుండును. 'సామాహమస్మి ఋక్ త్వం ద్యౌరహం పృథివీ త్వం'[9] అని వరుడు కన్యను వరించును. 'దీర్ఘాయురస్తు మే పతిర్జీవాతిశరదః శతమ్'[10] అని వధువు ప్రార్థించును. 'ఇహేమావింద్ర సంనుద చక్రవాకేవ దంపతీ'[11] అని బంధుమిత్రు లాశీర్వదింతురు. ఈ ధర్మము లే నాటివైనను నిత్యనూతనములును చిరంతన మాంగలికములును, సమాజహితాపాదకములును ననుట తథ్యము.

అథర్వవేదములో బ్రహ్మచర్యముకూడ ప్రశంసింపబడినది. అది మృత్యుంజయ మనియు, అభివృద్ధిమూలక మనియు చెప్పబడినది.

బ్రహ్మచర్యేణ తపసా దేవా మృత్యుమవాఘ్నత,
ఇంద్రోహ బ్రహ్మచర్యేణ దేవేభ్యః స్వరాభవత్.[12]

---

7 అథ. 14-1-43
8 ఋ. 10-84-46
9 అథ. 14-2-71
10 అథ. 14-2-63
11 అథ. 14-2-64
12 అథ. 11-3-2

అని దాని మాహాత్మ్య ముగ్గడింప బడినది. ఈ వేదములో 8 వ కాండమున మృత్యుంజయ సూక్తమును, 9 వ కాండమున మధుకశాఓషధీ సూక్తమును గోచరించును. వివాహ సభాజయాది వివిధ విషయ ములతోపాటు దీనిలో ఉత్తరక్రియలకు సంబంధించిన విషయములుకూడ చెప్పబడినవి.

ఈ వేదములో నక్షత్రములను కృత్తికనుండి యారంభించి లెక్కించు పద్ధతి గోచరించును. కాలమున కిందు మిక్కిలి ప్రాధాన్య మీయబడినది. కాలమన్నిటికిని మూలబీజము. అదే ప్రపంచమున కధిష్ఠానము. మనః ప్రాణనామములా కాలములోనే సమాహితమగునట్టివి. కాలమే ఈశ్వరుడు. ప్రజాపతికి పిత.

కాలే తపః కాలే జ్యాష్ఠః కాలే బ్రహ్మ సమాహితమ్,
కాలో హ సర్వస్యేశ్వరో యః పితాపీత్ ప్రజాపతేః. [13]

అథర్వవేదము 13-వ కాండలో రోహితుని వర్ణన మున్నది. అది సూర్యునికి ప్రతీకమని చెప్పుదురు.

స్కంభ ఉచ్ఛిష్ట సూక్తములలో ఈ వేదము పరబ్రహ్మస్వరూపమును ప్రకారాంతరముగా చర్చించును. పరమతత్త్వమున కాధారభూతమైనదేదో అదియే స్కంభము. అది యీ విశ్వమునకేకాదు బ్రహ్మకే కారణము. అది జ్యేష్ఠ బ్రహ్మ. భూమి, అంతరిక్షము, ఆకాశము, అగ్ని, సూర్యుడు, చంద్రుడు వాయువు అన్నియు దానిలో అంతర్భూతములు.[14] అది ఆత్మతో ఐక్యత నందియుండు తత్త్వము. ఉచ్ఛిష్టమనగా శేషించినది. దృశ్యప్రపంచమునగల నామరూపాత్మక తత్త్వము లన్నింటిని 'నేతి నేతి'గా తర్కించి నిషేదించుచు పోయినచో చివరకేది శేషించునో అది ఉచ్ఛిష్టము. అదియే బ్రహ్మము. ఈ జగత్తు వేదపురాణములతోను ప్రాణాపానచక్షుశ్శ్రోత్రాదులతోను కూడ ఉచ్ఛిష్టమునుండియే వెలువడును.

---

13 అథ. 19-53-8
14 అథ. 10-7-12

యచ్చ ప్రాణతి ప్రాణేన యచ్చ పశ్యతి చక్షుషా,
ఉచ్ఛిష్టాజ్జజ్ఞిరే సర్వే దివి దేవా దివి శ్రితః.[15]

అధ్యాత్మతత్త్వ విచారముతోపాటు ఆశ్రమ చతుష్టయ వివరణము కూడ అథర్వములో నున్నది. అచ్చటచ్చట కొన్ని దార్శనిక సూక్తములు గద్యలో కూడ నున్నవి. ఒకచోట సాంఖ్యయోగ వేదాంత బౌద్ధదర్శనము లన్నిటికిని మూల మనదగిన మంత్రము కాన్పించును.

అసతి సత్ ప్రతిష్ఠితం సతి భూతం ప్రతిష్ఠితం,
భూతం హి భవ్య ఆహితం భవ్యం భూతే ప్రతిష్ఠితమ్,
తదేవ విష్ణో బహుధా వీర్యాణి త్వం నః వృణీ,
పశుభిర్విశ్వరూపైః సుధాయాం మా దేహి పరమే వ్యోమన్.[16]

అథర్వవేదములోని కొన్ని సూక్తములకు వ్రాత్యసూక్తములని పేరు. వ్రాత్యులనగా సంస్కారలోపమునకు గురియైన వారని అర్థము. ఆనాటి సమాజములో సంస్కారము లోపించినవారు కొందరుండిరని తాండ్య బ్రాహ్మణాదులలో అన్యత్రకనిపించు వర్ణనలు సాక్ష్యమిచ్చును. కాని నియమరాహిత్యమును బ్రహ్మపదార్థమునుకూడ సూచింపగల తత్త్వము. పరబ్రహ్మ నియమాతీతుడే కనుక అతనికి సంస్కారలోపము వర్తింపదు. వ్రాత్యో వా ఇదమగ్ర ఆసీత్' అని ప్రారంభించిన సూక్తము ఋగ్వేదములోని హిరణ్యగర్భసూక్తమును చట్టున స్ఫురణకు తెచ్చును.[17] ఏది ఎట్లున్నను ఉపనిషద్వేదాంతమున కిది భూమిక అని మాత్రము తోచకమానదు. కనుక వ్రాత్యశబ్దమును పరబ్రహ్మ పరముగా కూడ అన్వయింపవచ్చునని కొందరి మతము.

ఋగ్వేదములోవలెనే అథర్వణవేదములోకూడ ఎన్నో ఆధిభౌతిక విషయములు వర్ణింపబడినవి. ఇవి ఆనాటిసమాజమును అప్పటివారు ఆచార విశ్వాసములను తెలియజేయును. దేవతా స్తోత్రములు, సోమస్తుతులు,

---

15 అథ. 11-7-23
16 అథ. 17-1-2.
17 హిరణ్యగర్భః సమవర్తతాగ్రేభూతస్య జాతః పతిరేక ఆసీత్. ఋ. 10-121-1

ద్రోణకలశ ప్రశంసలు మున్నగునవి చూచినచో ఋగ్వేదముకూడ యజ్ఞ మును తన్నిర్వహణ విధానమును మనసులో నుంచుకొని సంగ్రహించినదిగనే కాన్పించును. అట్లే అభిచార తంత్రమునుగూర్చి ప్రాకృతజనుల కుపకరించు విధముగా సంగ్రహించిన వేదము అథర్వణము కావచ్చును. స్వర్గప్రాప్తి యజ్ఞఫలము. సంసార సుఖము శాంతి, పౌష్టిక క్రియల ఫలము. అథర్వ ములో మానసిక యజ్ఞముకూడ వివరింపబడినది. ఇది అల్పవ్యయముతో సులభసాధ్యమునగు ఆధ్యాత్మికసాధనకు ప్రక్రియ.

అథర్వవేదములోని భాషాచ్ఛందాదులు దాని నర్వాచీన రచనగా నిరూ పించును. అట్లే దీనిలో వర్ణించిన భౌగోళిక చారిత్రక సాంస్కృతిక విషయములుకూడ దీనిని వెనుకటికాలమునకే సంబంధించినదిగా చెప్పును. ఇందులో వర్ణించిన దేవతలుకూడ ప్రకృతి ప్రతీక తత్త్వములుగా కాక దుష్టశిక్షణమును శిష్టరక్షణము చేయు పౌరాణిక దేవతలకు సన్నిహితులుగా కాన్పింతురు. ఇందలి ఆధ్యాత్మికవాదముకూడ ఉపనిషద్వాదమునకు చేరువ. వేదమునకుగల 'త్రయీ' అను పేరుకూడ అథర్వమును తరువాత కాలపు రచనగానే నిరూపించును. తిలక్ పండితుడు అథర్వణవేదము లోని చాలభాగములు భారతదేశమునకు వెలుపలగల దేశములలోని ఆచార వ్యవహారములకు సంబంధించినవిగా చెప్పెను. కొందరీ వేదమును జరథుస్త్రా అసురవేదమని చెప్పుదురు. 'అవెస్తా' లోని 'అథ్రవన్' అను శబ్దము అథర్వమునకు మూలమని కొందరి మతము. కాని ప్రాచీన పౌరాణికవాద మీ వాదములతో ఏకీభవింపదు. అన్ని వేదములు ఒకేసారి పరమేశ్వరుని ముఖమునందుద్భవించినవనియు, ఆ మీదనే సృష్టి జరిగిన దనియు సనాతనులు నమ్మెదరు. వేదసంహితను నాల్గుగా విభజించినది వ్యాసభగవానుడు. చదివిన దాతని శిష్యచతుష్టయము. కనుక వాని పూర్వా పర్వతములు గాని ప్రాచీనార్వాచీనతలుగాని నిర్ణయించుట తగదని చెప్పుట అనూచానమైన సంప్రదాయము. ఇదే సాయణుని మతము.

* * * *

# బ్రాహ్మణములు

"మంత్రబ్రాహ్మణయోర్వేదనామధేయమ్" అని చెప్పిన దానినిబట్టి సంహితలోని మంత్రభాగమున కెంత ప్రాధాన్యమో, గద్యభాగమైన బ్రాహ్మణములకును అంతే ప్రాధాన్యమని గ్రహింపవలెను. బ్రాహ్మణములు గద్యాత్మకములు. యజుర్వేదములో సంహితలోనే మంత్ర బ్రాహ్మణములు రెండును కలిసియుండును. కాని తక్కినవేదములలో మంత్రభాగములు సంహితగా నేర్పడి, బ్రాహ్మణములు విడిగా నేర్పడి నట్లుండును.

బ్రహ్మనుగూర్చి వ్యాఖ్యానించునవి బ్రాహ్మణములు. బ్రహ్మపదమునకు మంత్రమనియు యజ్ఞమనియు అర్థము లున్నవి.[1] కనుక మంత్రార్థము లను యజ్ఞ విధులను వివరించి చెప్పునవి బ్రాహ్మణములని, 'బ్రాహ్మణం నామ కర్మణస్త న్మంత్రాణాం చ వ్యాఖ్యానగ్రంథః' అని నిర్వచింప బడెను.[2] మంత్రార్థ వివరణము వినియోగము, ప్రయోజనము, ప్రతిష్ఠా నము, అందుకువలసిన విధులు బ్రాహ్మణముల వలన తెలియదగునని వివరించుచు,

నైరుక్తం యస్య మంత్రస్య వినియోగః ప్రయోజనమ్,
ప్రతిష్ఠానం విధిశ్చైవ బ్రాహ్మణం తదిహోచ్యతే.

అని వాచస్పతి మిశ్ర వ్రాసెను. బ్రాహ్మణ సదృశమో లేక తదవాంతర భాగమో అయిన దానిని 'అనుబ్రాహ్మణము' అని వ్యవహరింతురు. మంత్ర వినియోగాదులున్న వానిని కర్మబ్రాహ్మణములనియు, కేవల మంత్ర సంకలనమున్న వానిని కల్పబ్రాహ్మణము లనియు పిలుతురు.

బ్రాహ్మణులలో విధి, అర్థవాదము, ఉపనిషత్తు అను మూడు భాగ ములు. విధిలో ఆ యా యజ్ఞములు ఎట్లు, ఎవరు, ఏ విధముగా

---

1 బ్రహ్మ వై మంత్రః. శత. 7-1-1-5: ఏష వై ప్రత్యక్షం యజ్ఞో యత్ ప్రజాపతిః. శత. 4-3-4-3.

2 తైత్త. సం. భాష్యము, భట్టభాస్కరుడు.

ఆచరింపవలెనో తెల్పునట్టి విధాయక వాక్యములు చేరును. వాటిని సోపపత్తికముగా నిరూపించుటకు చెప్పిన వాక్యాదు లన్నియు అర్థవాదము క్రింద గ్రహింపబడును. తత్త్వవిచారమునకు సంబంధించిన వాక్యములు ఉపనిషద్భాగమున గ్రహింపబడును. వీనిలో విధి ముఖ్యము. తక్కినవి గౌణము.

హేతునిర్వచనం విందా ప్రశంసా పంశయో విధిః,
పరిక్రియా పురాకల్పో వ్యవధారణ కల్పనా,
ఉపమానం దశైతే తు విధయో బ్రాహ్మణస్య తు.

అని శాబరభాష్యము (2-1-8)లో బ్రాహ్మణముల లక్షణము మరి కొంత వివరముగా చెప్పబడెను. ఏ క్రియ ఎందు కాచరింపవలెనో తెలుపునది హేతువు. శబ్దార్థమును స్పష్టపరచునది నిర్వచనము. యాగో పయోగి వస్తువులను గూర్చి, విధి విధానములను గూర్చి, సయుక్తికముగా నచ్చచెప్పుటకై వలసిన ప్రక్రియలు నిందా ప్రశంసాదులు. దీనిలో కథలు, కల్పనలు, ఉపమానాలు ఊహలు, మున్నగునవన్నీ ఉపయోగ పడునట్టివే. వీనినే అర్థవాదాలని పేర్కొందురు.

బ్రాహ్మణములు గద్యలో ఉన్నను మంత్రములవలె ఇవికూడ స్వర యుక్తములు. ఇవి సరళమైన భాషలో చిన్న చిన్న వాక్యములుగా నుండును. వైదిక లౌకిక సంస్కృతభాషల కిది మధ్యకాలపు భాషాశైలి యని పండితులు చెప్పుదురు. సంహితలో మృగశీర్షాదిగానున్న నక్షత్రగణన బ్రాహ్మణులలో కృత్తికాదిగా కనిపించును. శతపథద్వితీయకాండలో కృత్తిక సరిగా తూర్పున ఉదయించి నట్లున్న వర్ణనచూచి నేటికిది 3000 ఏండ్లనాటి రచనయని వింటర్ నిజ్ పండితుడు లెక్కించెను. కాని మైత్రీ ఉపనిషత్తు ననుసరించి ఇది యింకను వేయేండ్లు వెనుకకు చెందునని మరికొందరి వాదము.

బ్రాహ్మణములలో కురుపాంచాల దేశములు వర్ణింపబడినవి. సరస్వతీ నది వినశన మనుచోట అంతర్వాహినిగా మారి, తిరిగి పక్షప్రస్రవణ మను చోట ఉద్గమించినట్లు వ్రాయబడినది. యమునా ప్రవాహభూమి, సరస్వతీ

దృషద్వతీ నదుల సంగమస్థానము నిర్దేశింపబడినవి. ఈ ప్రదేశమునే మనువు బ్రాహ్మావర్తమని పిల్చెను.[3] ఇది ధర్మానికి నెలవని ఇతరుల కాదర్శమని చెప్పుచు.

ఏతద్దేశ ప్రసూతస్య సకాశాదగ్రజన్మనః,
స్వం స్వం చరిత్రం శిక్షేరన్ పృథివ్యాం సర్వమానవాః.

అని వ్రాసెను. కురుక్షేత్రములో ప్రజాపతి యజ్ఞవేది నిర్మించెను. ఎందరో ఋషులు యజ్ఞ యాగము లాచరించిరి. భారతయుద్ధ మాచోట ప్రవర్తిల్లెను. ఈ మండలానికి చెందిన భాష ఉదీచ్యభాష అనీ అది మిక్కిలి ప్రశస్తమనీ శాంఖాయన బ్రాహ్మణములో చెప్పబడెను.

ఋగ్వేదమునకు చెందిన బ్రాహ్మణములలో ఐతరేయము ప్రసిద్ధము. ఇది మహిదాసకృతము. 'జెంద్ అవెస్తా'లో ఋత్విజునికి 'ఎథ్రేయ' అని పేరు. అదే ఐతరేయశబ్దమునకు మూలమేమో అని కొందరి అనుమానము. ఇందులో 40 అధ్యాయముల గ్రంథము 8 సంచికలు 285 కండికలుగా విభజింపబడినది. అంతటా హోతృకార్యకలాపములే ఎక్కువగా వర్ణింపబడినవి. అగ్నిష్టోమ, ఉక్థ, అతిరాత్ర, రాజసూయాది యజ్ఞములెన్నో వివరింపబడినవి. ఇంద్రమహాభిషేక, సామ్రాజ్యాభిషేకములుకూడ వర్ణింపబడినవి. దీనికి సాయన భాష్యమేకాక మరి రెండు భాష్యములు కూడ దొరుకుచున్నవి. ఋగ్వేదీయ శాంఖాయన బ్రాహ్మణముకూడ 36 అధ్యాయముల బృహద్గ్రంథము. కౌషీతకిలో కూడ ఎన్నో సోమయాగములు చెప్పబడినవి. సాంఖ్యాయన శ్రౌతసూత్రములో పురుష మేధాదులు ప్రతీకాత్మకములుగా వివరింపబడినవి.

బ్రాహ్మణములలో యజ్ఞయాగాదుల వివరణముతోపాటు ప్రాసంగికములైన కథలు, దేశకాలాదుల చర్చలు మున్నగునవికూడ గోచరించును. ఐతరేయములో నొకచోట ఋగ్యజుస్సామములు మూడును వాణి అనియు, అథర్వము మనస్సనియు వర్ణింపబడెను. సౌపర్ణ సూక్తములను ప్రశంసిం

[3] మనుస్మృతి 2-22.

చుచు గాయత్రి పక్షిరూపముననేగి సోమరసము తెచ్చినట్లు చెప్పబడెను. ఇదే బ్రాహ్మణములో శునశ్శేపునికథ విస్తారముగా వినిపించును. ఈ కథలోనే ఆంధ్రులు విశ్వామిత్ర సంతతిగా, వింధ్యకు దక్షిణముగా వలసివచ్చిన వారుగా వర్ణింపబడిరి. అట్లే హరిశ్చంద్రుడు, జనమేజయుడు, శర్యాతి, సుదాసుడు, భరతుడు మున్నగు వారి కథలతోపాటు విదేహ, దక్షిణమునగల భోజ (సాత్వత యాదవ) రాజ్యములు, పశ్చిమమునగల నీచ్య, అపాచ్య రాజ్యములు, ఉత్తరమున కురుమద్ర రాజ్యములు కూడ దీనిలో వర్ణింపబడినవి.

శుక్లయజుర్వేదమునకు సంబంధించిన బ్రాహ్మణములలో శతపథము మిక్కిలి ప్రసిద్ధము. ఇందనేక యాగములు, అగ్ని రహస్యము, విష్ణుక్రమము, శతరుద్రీయము, ఉపనయనస్వాధ్యాయ సర్వమేధాదులు, ద్వాదశాహ క్రతువులు, షాణ్మాస సత్రములు, సౌత్రామణివంటి వర్షయాగములు మున్నగునవెన్నో వర్ణింపబడినవి. యజ్ఞమునకు ఆధ్యాత్మిక వ్యాఖ్యాన మొనర్చి, అంతర్యాగ బహిర్యాగములకు సామరస్యము విధించబడినది. ఈ బ్రాహ్మణములోని స్వరాంకన పద్ధతిని, ఉచ్చారణ విశేషములనుబట్టి ఇది అన్నిటికంటె ప్రాచీనమైన బ్రాహ్మణమని పండితులు నిర్ణయించిరి. ఇందులో దుష్యంతుడు, భరతుడు, ఉద్దాలకుడు, ఆరుణి మున్నగు వారి కథలతోపాటు ప్రాచీన జలప్రళయమును, మత్స్యావతారమును, వైవస్వతమనువు చరిత్రమును విస్తారముగా వర్ణింపబడినవి. వేరొకచోట విదేహ మాధవుడు తన పురోహితుడైన గౌతమరాహుగణునితో గండకినది దాటి తూర్పుగా వలస వెళ్ళినట్లు చెప్పబడెను.

ఈ బ్రాహ్మణములో త్రయీ మంత్రముల సంఖ్య 24 వేలుగా లెక్కింపబడెను.[4] ప్రతి నాల్గవ ఏటను 21 రోజులు సంవత్సర పూర్తికిగాను చేర్చవలెననియు, ఆ సంవత్సరము అశ్వమేధ మొనర్చవలెననియు చెప్పబడెను.[5] శతపథ బ్రాహ్మణమునే వాజసనేయమనికూడ పేర్కొందురు. దీనిలో 14 వ కాండ అరణ్యకము.

---

4 శత. బ్రా. 10-4-18.

5 శత. బ్రా. 13-3-6

కృష్ణయజుర్వేద బ్రాహ్మణములలో తైత్తిరీయము ప్రధానము. ఇది స్వరయుక్తము. ఇది మూడు కాండలుగా 12 అధ్యాయము (ప్రపాఠకము)లు గల గ్రంథము. ఈ అధ్యాయములు తిరిగి కొన్ని అనువాకములుగా విభజింపబడినవి. ఇందులో వైశ్వసృజ యజ్ఞము వివరింపబడినది. అశ్వమేధము క్షత్రియులే ఆచరింపదగునని నిర్ణయింపబడినది. రాజపుత్రులు ఉగ్రులు, క్షత్రియులు అని రాచరికమునుబట్టి రెండువిధములుగా చెప్పబడిరి. కాలకంజాసురునికథ, వరాహావతారకథ, సోమ, శ్రద్ధా, సీతా, సావిత్రి మున్నగు వారి వివాహకథలు దీనిలో వర్ణింపబడినవి. ఒకచోట దీర్ఘరాత్రులు పేర్కొనబడినవి.[6]

సామవేదానికి చెందిన బ్రాహ్మణములలో తాండ్యబ్రాహ్మణము చాల ప్రసిద్ధము. ఇది 40 అధ్యాయముల గ్రంథము. దీనిలో మొదటి 25 అధ్యాయములు పంచవింశ బ్రాహ్మణమనియు, ఆ మీది అయిదు అధ్యాయములు షడ్వింశ బ్రాహ్మణమనియు, ఆ పైని రెండధ్యాయములు మంత్ర బ్రాహ్మణమనియు, చివరి ఎనిమిదిఅధ్యాయములు ఛాందోగ్య బ్రాహ్మణమనియు వ్యవహరింపబడును.

ఛాందోగ్యబ్రాహ్మణమే ఛాందోగ్యోపనిషత్తు. దీనిలో ఒకభాగమునకు దేవతాధ్యాయమని పేరు. ఆ కారణమున ఆ భాగమునకు దైవత బ్రాహ్మణమని పేరు వచ్చినది. తాండ్యబ్రాహ్మణము తండిఋషినిర్మితము. దీనిలో ఎన్నో సోమ యాగములు వివరింపబడినవి. ఇవన్నీ శ్రౌతయజ్ఞములు. ఈ బ్రాహ్మణములో కూడ సరస్వతీ దృషద్వతీ నదుల ప్రదేశము, కురుక్షేత్రము, నైమిశారణ్యము, అచ్చటి యజ్ఞము, వ్రాత్యస్తోమము, అనేక ప్రాయశ్చిత్తములు పేర్కొనబడినవి. ఇందులో కొన్ని ఏకాహయజ్ఞములు, మూడువర్ణములవారు కలిసి నిర్వహింపదగిన అహీనయాగములు కూడ వర్ణింపబడినవి. గ్రంథ విస్తృతినిబట్టి దీనికి మహాబ్రాహ్మణమని పేరు.

---

6 తై. బ్రా. 1-5-7

సామవేదీయములైన ఆర్షేయ, వంశ, సంహితోపనిషత్, సామవిధాన జైమినీ బ్రాహ్మణములుకూడ సోమయాగములను, సామవిధానమును, సామవేదీయ ఋష్యానుక్రమణికలను వివరించును. జైమినీ బ్రాహ్మణమునే తలపకర బ్రాహ్మణమనికూడ పేర్కొందురు. ఈ బ్రాహ్మణము పూర్తిగా దొరకలేదు. దీనిలో ఒక భాగమైన ఉపనిషద్బ్రాహ్మణమునే గాయత్ర్యుపనిషత్తని వ్యవహరింతురు.

అథర్వణవేదమునకు చెందిన గోపథ బ్రాహ్మణము పూర్వోత్తరభాగములుగా లభించుచున్నది. పూర్వభాగమున అయిదు, ఉత్తరభాగమున ఆరు ప్రపాఠకము లున్నవి. దీనిలో ఓంకారము, గాయత్రి, బ్రహ్మచారి నియమములు, ఋత్విక్కుల కార్యకలాపములు, దీక్ష, సంవత్సరసత్రములు మున్నగు విషయము లెన్నో వర్ణింపబడినవి. ఎన్నోశబ్దములు నిర్వచింపబడినవి. ఒకచోట బ్రాహ్మణులకు నృత్యగానములు నిషిద్ధములని చెప్పబడినది.[7]

బ్రాహ్మణములలో యజ్ఞయాగములే ప్రధానముగా వర్ణింపబడిన విషయము. అది యజ్ఞయాగములకు చెందినయుగము. 'యజ్ఞో వై శ్రేష్ఠతమం కర్మ అని ఆనాటి వారి విశ్వాసము. యజ్ఞమే బ్రహ్మ. అదియే ప్రజాపతి. అతడే పరమాత్మ. అగ్నిహోత్రమునుండి అశ్వమేధమువరకుగల యజ్ఞములన్నియు తదారాధనలే. దేవతలు పరంపరయా ప్రజాపతి స్వరూపులు. ప్రజలు వృష్టి కాములై యజింతురు.[8] యజ్ఞమువలన ధూమము, దానివలన మేఘము [9] తదుపరి విద్యుత్తు సంభవించి అన్నాదులు లభించును.[10] మరుత్తులు వర్షాది దేవతలు [11] నిత్యాగ్ని హోత్రులు సమస్త పాపములనుండి విముక్తులగుదురు. [12]

---

7 తస్మాత్ బ్రాహ్మణో నైవగాయేన్న నృత్యేన మా గ్లాగృధః (గోపథ. 2-21)
8 శత. 1-7-3-5
9 వృష్టికామో యజేత. (శతపథము)
10 అగ్నేర్వైధూమో జాయతే ధూమాదభ్రం అభ్రాద్ వృష్టిః (శత. 5-3-5-17)
11 విద్యుద్దీదం వృష్టిమన్నాద్యం సంప్రయచ్ఛతి॥(ఐత. 2-41) మరుతో వై వర్షస్యేశతే. (శత. 9-1-2-5)
12 సర్వస్మాత్ పాప్మనో నిర్ముచ్యతే య ఏవం విద్వానగ్నిహోత్రం జుహోతి. (శత. 2-3-1-6)

ప్రజాపతి నిత్యుడు. అమృతస్వరూపుడు.[13] అతడే యీ సృష్టికాద్యుడు. అతని సంకల్పమే సృష్టి[14] మనసావరేణ్యుడైన యాతని తత్త్వమెరిగినవారు ముక్తులు.[15]

యజ్ఞములో 7 గృహ్యాగ్నికిని 14 శ్రౌతాగ్నికిని సంబంధించునవి. పుత్రేష్టి, రాజసూయాదులు ప్రత్యేకములు. యజ్ఞబలి బహుధా అనుకల్ప రచితము. వనస్పతులకు యాజ్ఞియములని పేరు. [16] మానవకల్యాణము, విశ్వశాంతి యజ్ఞమునకు ప్రధానలక్ష్యములు.

బ్రహ్మణములలో దేవతలు హవిర్భుజులనియు, సంఖ్యకు 33 గురు అనియు, ఇంద్రుడు దేవాధిపతి అనియు చెప్పబడినది. 'పరోక్షప్రియ హి దేవాః ప్రత్యక్ష ద్విషః' అని పదేపదే పేర్కొనబడినది. ఐతరేయములో 'రుద్రోవై జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ దేవానాం'[17] అనిచెప్పి శివ, భవ, పశుపతి, ఉగ్ర, మహాదేవ, రుద్ర, ఈశాన నామములు నిర్వచింపబడినవి. అట్లే అగ్నిర్వై దేవానామవమో విష్ణుః పరమః[18] అని విష్ణుపారమ్య మంగీకరింపబడినది.

బ్రాహ్మణులు విద్వాంసులను 'విద్వాంసో హిదేవాః' అనిగౌరవించును.[19]

బ్రాహ్మణులు మనుష్యదేవులనియు, వారికి సోముడు రాజనియు, నిష్ఠాధ్యయ నాదులు వారికి తేజస్సు కూర్చున వనియు వర్ణించును. బ్రాహ్మణులు యజ్ఞ దక్షిణ లందుకొందురు. అతిమానము పరాభవమునకు మూలము.[20] సత్యము వేదము. అదే విద్య. [21]

---

13 ప్రజాపతిర్వా అమృతః (శత. 6-3-1-17)

14 ప్రజాపతిర్వా ఇదమగ్ర ఆసీత్. ఏక ఏవ సోఽకామయత. (శత. 6-3-3-1)

15 మనసైవ వేనమాప్నోతి (కారకసంధి 29-6). పునర్మృతుల ముచ్యతే గచ్ఛతి బ్రాహ్మణః సాత్మతామ్ (శత. 11-5-6-9)

16 శత. 3-2-2-9

17 ఐత. 25-13

18 ఐత. 1-1

19 శత. 3-7-3-10

20 శత. 5-1-1-1

21 శత. 9-5-1-18

బ్రాహ్మణముల ననుసరించి సంవత్సరమునకు 360 దినములు. మానవ శరీరమునగల ఎముకలు 360. మానవాయుర్దాయ పరిమితి నూరేండ్లు. ఋతుసందులలో వ్యాధు లుద్భవించును.[22] అగ్ని రక్షోగణముల నపహరించును. [23] హిరణ్యము దీర్ఘాయువు నిచ్చును.

దేవ, ఋషి, పితౄణములనుండి విముక్తుడగుటకై పురుషుడు ప్రేమ పూర్వకముగా వివాహ మాడవలెను. భార్య పరమసఖునివంటిది. అర్ధాంగి.[24] అపత్నీకుడు అగ్నిహోత్ర మాచరింపకూడదు.[25] అపుత్రకునికి సద్గతి లేదు.[26]

బ్రాహ్మణములు నీతికి ప్రాధాన్యమిచ్చును. సత్యము నుత్కృష్ట ధర్మముగా చెప్పును. ఒకపాప మింకొకపాపమునకు దారితీయునని హెచ్చరించును.[27] కర్మాచరణమున శ్రద్ధాళువులై యుండుడని ఉపదేశించును. ఆతిథ్య ముత్తమ ధర్మమని చెప్పును.[28]

బ్రాహ్మణములలో స్త్రీలు లక్ష్మీస్వరూపలుగా మంగళదాయినులుగా వర్ణింపబడిరి. స్త్రీలను హింసింపరాదని చెప్పబడినది.[29] పాతివ్రత్యము, వీర మాతృత్వము స్త్రీల కాదర్శములు.

బ్రాహ్మణముల ననుసరించి సగోత్రీకులైనచో వివర్ణులైనను ఏకవాస మున కర్హులు.[30] వ్రాత్యులు తలపాగ, ములుగోల, చేతికర్ర, గూడులేని బండి, వెండినాణెములు దక్షిణలుగా గ్రహించుచుండిరి. ఋత్విజులు ఎర్రపాగాలు ఎర్రంచు ధోవతులు ధరించుచుండిరి. బ్రాహ్మణములో ఈ విధమైన వర్ణధర్మములతో పాటు ఆనాటి జ్యోతిష, రేఖాగణిత, ఆయు ర్వేదాది విద్యలకు సంబంధించిన విషయము లెన్నో ప్రసంగ ప్రాప్తముగా వర్ణింపబడినవి.

---

22 గోపథ. 2-11-9
23 శత. 1-2-1-6
24 సఖా హ జాయా. (ఐత 7-3-13) అరో హ వై ఆత్మనో యజ్జాయా (శత. 5-2-1-10)
25 ఐత. 7-10
26 ఐత. 7-13
27 యః పకృత్ పాపం కుర్యాత్ కుర్యాదేనస్తతోఽపరమ్. (ఐత. 7-17)
28 శిరో వా ఏతద్యజ్ఞ స్య యదాతిథ్యమ్ (ఐత. 1-25)
29 న వై స్త్రియం ఘ్నంతి. (శత. 11-4-3-2)
30 బ్రాహ్మణే సమానగోత్రే వసేత్ సమానే గోత్రే తస్యోపత్యై. (శాం. 25-15)

# ఆరణ్యకములు

వానప్రస్థుల యజ్ఞ యాగాది విధానమును వర్ణించు వేదవిభాగమునకు ఆరణ్యకమని పేరు. ఇది అరణ్యములో చదువదగినదని చెప్పుచు 'అరణ్య ఏవ పాఠయిత్వా దారణ్యక మితీర్యతే' అని బోధాయనుడు దీనిని బ్రాహ్మణమనియే నిరూపించెను. కాని బ్రాహ్మణములో గృహస్థుల ధర్మాలు, ఆరణ్యకములో వానప్రస్థుల ధర్మాలు వింగడించి వేర్వేరుగా చెప్పినట్లుండును. సాయణుడుకూడ దీనిని అరణ్యాలలో అరణ్యవాసులైన మునులచే పఠింపదగిన దనియే నిర్వచించెను.

అరణ్యాధ్యయనాది తద్ ఆరణ్యక మితీర్యతే ।
అరణ్యే తదధీయాతే త్యేవం వాక్యం ప్రవక్ష్యతే ॥[1]

సన్యాశ్రమస్థులు చేయదగిన మహావ్రతము, హౌత్రము వంటి యజ్ఞము లెన్నో ఆరణ్యకములలో వివరింపబడినవి. వీనిలో యజ్ఞాచరణవిధానము స్వల్పముగాను, దానిని గురించిన తత్త్వమీమాంస అధికముగాను గోచరించును: యజ్ఞమునకు ఆధిదైవిక, ఆధ్యాత్మిక వ్యాఖ్యలు ప్రదర్శింపబడును. ఐతరేయారణ్యకము (3-2-3-12)లో ఋగ్వేదులు "మహత్ సత్తాను ఉక్థద్వారా ఉపాసింతురు. యజుర్వేదులు దానినే యజ్ఞముచేత నర్చింతురు. సామవేదులు మహావ్రతయోగముచే దాని నారాధింతురు" అని చెప్పబడినది. అట్లే తైత్తిరీయారణ్యకములో ఆరంభముననే కాలమునకు గల పారమార్థిక, వ్యావహారికరూపములు చర్చింపబడినవి. కాలము మహానదివంటిది.

నదీవ ప్రభావాత్ కాచిత్ అక్షయ్యాత్ యథా।
తాం నద్యోఽభిసమాయాంతి సోమః సతీ న నివర్తతే॥[2]

ఇందులో ఋతువులు వర్ణింపబడినవి. వర్ష ఋతువులో రోగములు ప్రకోపించునని, కామెర్లరోగికి అన్నివస్తువులు పసుపుపచ్చగా కనిపించునని వర్ణింపబడినది. పుణ్యార్జన, పాపవర్జన ప్రశంసింపబడినవి. పంచమహాయజ్ఞములు ప్రస్తావింపబడినవి. వర్ణాశ్రమధర్మములు విస్తరించి వర్ణింపబడినవి.

---

1 తై. ఆ. భాష్యం. శ్లో.6
2 తై. ఆ 1-2

ఆరణ్యకములలో ప్రాణవిద్య ప్రతిపాదింపబడినది. దీనికి ప్రమాణముగా ఋగ్వేదమంత్రభాగము లుదాహరింపబడినవి. ప్రాణము 'గోప' శబ్దముచే వ్యవహరించబడెను. 'సర్వం హీదం ప్రాణేనావృతం' అని ప్రాణము సర్వత్ర వ్యాపించియుండునని చెప్పబడెను. దినము ప్రాణరూపమనీ, రాత్రి అపానరూపమనీ వర్ణింపబడెను. "ఉదయకాలమున ప్రాణము ఇంద్రియములను శరీరములో వ్యాపింపజేయును. అది ప్రతననము. ఆ కారణమున దానికి ప్రాతఃకాలమని పేరు. సాయంకాలమున అది ఇంద్రియములను తిరిగి సంకోచింపజేయును. అది సమాగకము. కనుకనే దానికి సాయంకాలమని పేరు. ప్రాణము దేవాత్మకము."[3] హిరణ్యవదనుడను ఋషి యీ ప్రాణవిద్యను దర్శించెను. ప్రాణమే ఋషిరూపము. గృత్సమద, విశ్వామిత్ర, వామదేవ, అత్రి, భరద్వాజాదు లందరును ప్రాణస్వరూపులే. అట్లే "సర్వా ఋచః సర్వే వేదాః సర్వే ఘోషా ఏకైవ వ్యాహృతిః ప్రాణ ఏవ ప్రాణఋచ ఇత్యేవ విద్యాత్" అని సమస్తమును ప్రాణ స్వరూపమే అని నిశ్చయింపబడెను.[4]

వేర్వేరు వేదములకు వేర్వేరు ఆరణ్యకములున్నవి. నేడు ఆ యా వేదములకు సంబంధించిన ఆరణ్యకములు ఏడుమాత్రమే లభ్యమగుచున్నవి. ఋగ్వేదమునకు చెందిన ఐతరేయారణ్యకము మిక్కిలి ప్రసిద్ధము. ఇది 5 భాగములుగా 18 అధ్యాయములుగల గ్రంథము. తిరిగి దీనిని కొన్నిఖండములుగా విభజించిరి. ఇందులో మొదట మహావ్రతయాగము వివరింపబడినది. ఇది గవామయనసత్రములో మొదటి దినమున నాచరించు యాగము; ఆ మీద ఉక్థ, నిష్కైవల్య శస్త్ర, ప్రాణవిద్యా, పురుషవివేచనాదులు వర్ణింపబడినవి. పిమ్మట నిర్భుజ (సంహిత), ప్రతృణ (పదపాఠ) సంహితల భేదము, సంధి, స్వర, స్పర్శ, ఊష్మవర్ణముల భేదము వివరింపబడినది. ఈ భాగమునకు 'సంహితోపనిషత్' అని పేరు. దీనిలో కొందరు ఋషికలుకూడ పేర్కొనబడిరి. తర్వాతిభాగములో మహావ్రతములో అయిదవనాడు ఉపయోగపడునట్టి మహానామ్నీ ఋక్కులు సంగ్రహింపబడినవి. నిష్కైవల్యశస్త్రము (మహావ్రతోపయోగిమంత్రభాగము) చివరి అధ్యాయమున వర్ణించబడినది.

---

3 ఐత. ఆ. 103-184

4 ఐత. ఆ 2-2-10

ఈ అరణ్యకములోని మొదటి మూడు భాగములకు ఇతరాపుత్ర ఐతరేయ మహిదాసుడును, నాల్గవదానికి ఆశ్వలాయనుడును, అయిదవ భాగమునకు శౌనకుడును ఋషులుగా చెప్పబడిరి.

కౌషీతకి (శాంఖాయన) అరణ్యకము 15 అధ్యాయములతో అనేక ఖండములుగా విభజింపబడిన గ్రంథము. దీనిలో 3 నుండి 6 వరకుగల అధ్యాయములు 'కౌషీతకీ ఉపనిషత్తు' అని పిల్వబడును. ఈ ఆరణ్యకములో బృహదారణ్యకములోని భాగము లెన్నియో ఉదాహరింపబడినవి. దీనిలో శునశ్శేపుడు, అహల్య, ఉశీనరాదుల కథలు, ఖాండవము, కురుక్షేత్రము, కాశీ, మత్స్య, పాంచాల, విదేహాదుల ప్రస్తావములు గోచరించును.

యజుర్వేదమునకు సంబంధించిన ఆరణ్యకములలో తైత్తిరీయారణ్యకము కృష్ణయజుస్సునకును, బృహదారణ్యకము శుక్లయజుస్సునకు చెందినవి. ఇవి మిక్కిలి ప్రసిద్ధములు. తైత్తిరీయారణ్యకము తైత్తిరీయబ్రాహ్మణములోని అంతిమభాగము. ఇది 10 భాగములు 170 అనువాకములుగల గ్రంథము. దీనిలో 7 నుండి 9 వరకుగల భాగములకే తైత్తిరీయోపనిషత్తని పేరు. పదియవ భాగమునకు నారాయణీయోపనిషత్తని వ్యవహారము. ఈ ఆరణ్యకములో కూడ కాసీ, పాంచాల, మత్స్య, కురుక్షేత్రాదుల, ప్రశంసలు; కశ్యప, పారాశర్య, వ్యాస, తపస్వినీ, శ్రమణాదుల ప్రసంగములు, నరకవర్ణనము గోచరించును. దీనిలో అగ్ని, విద్య, స్వాధ్యాయయజ్ఞము, పంచమహాయజ్ఞములు, చాతుర్హోత్రచిత్తి, ప్రవర్గ్య యాగము, అభిచారహోమములు, రౌద్రప్రయోగములుకూడ వర్ణింపబడినవి. సహగమన మాచరింపబోవు స్త్రీని వలదని వారించుచు పతి ధనుర్బాణాదులు మాత్రము గ్రహించి, చితిని విడిచి రావలసినదని చెప్పిన ప్రసంగ మొకచోట కాన్పించును.[5] అట్లే యజ్ఞోపవీతము ధరించి చేసిన దంతయు యజ్ఞమనియే వేరొకచోట నిర్వచింపబడెను.

[5] తై. ఆ. 6-1

"ప్రవృతోహవై యజ్ఞోపవీతినో యజ్ఞః యత్కించ
బ్రాహ్మణో యజ్ఞోపవీత్యధీతే యజత ఏవ తత్ ॥"[6]

ఇంకొక చోట నీరు నాల్గు విధములని చెప్పబడెను. "చత్వారి వా అపాం రూపాణి, మేఘో, విద్యుత్, స్తనయిత్నుర్వృష్టిః" అని మేఘము, మెరుపు, ఉరుము, వర్షము అనునవి నీటిభేదములుగా చెప్పి, ఆమీద కూప తటాక ప్రవాహపాత్ర నదీజలాదులు కూడ వేర్వేర వర్ణింపబడెను.

తైత్తిరీయమున నారాయణీయాదులు ఖిలకాండగా పరిగణింపబడినవి. ఈ అరణ్యకములోని అనువాకసంఖ్యకూడ కర్ణాట, ద్రావిడ, ఆంధ్ర, తదితర దేశములలో భిన్న భిన్నముగా గోచరించును. సాయణుడు ఆంధ్రపాఠము ననుసరించి వీనిలో 80 అనువాకములు మాత్రమే స్వీకరించెను.

మైత్రాయణీ ఆరణ్యకముకూడ కృష్ణయజుస్సంబంధియే. దీనికి బృహ దారణ్యకమనికూడ మారుపేరున్నది. దీనిలోకూడ అగ్నివిద్యాదులు వర్ణింపబడినవి.

శుక్లయజుస్సంబంధి. దీనికి బృహదారణ్యకమనికూడ మారుపేరున్నది. దీనిలోకూడ అగ్నివిద్యాదులు వర్ణింపబడినవి.

శుక్లయజుస్సంబంధి శతపథములో మాధ్యందిన, కాణ్వాబృహదారణ్యక ములు రెండు గోచరించును. రెండిటిలోను ఉపనిషద్భాగములు కలిసియే యున్నవి. కనుకనే వీనిని బృహదారణ్యకోపనిషత్తని వ్యవహరింతురు. రెంటి లోను యాజ్ఞవల్క్యునికథ వర్ణింపబడినది. రెండును సన్యాసవిధానమును వివరించును.

సామవేదమునకు చెందిన ఆరణ్యకములలో తలవకార ఆరణ్యకము మిక్కిలి ప్రసిద్ధము. దీనిని జైమినీయ ఉపనిషద్బ్రాహ్మణమనియు, తలవకా రోప నిషత్తనియుకూడ పిలిచెదరు. కేనోపనిషత్తు దీని అవాంతరభాగము. సామవేదీయ ఛాందోగ్యారణ్యకము కూడ లభ్య మగుచున్నది.

అథర్వవేదమునకు చెందిన ఆరణ్యకమేదియు మునకు మిగులలేదు.

---

6 తై. అ. 2-101

# ఉపనిషత్తులు

వేదములో కర్మకాండ బ్రాహ్మణములలోను, ఉపాసనాకాండ ఆరణ్యకములలోను, జ్ఞానకాండ ఉపనిషత్తులలోను వివృతమైనవి. ఇవన్నియు వేద భాగములే. వేదమునకు అంతిమభాగమగుటచేత ఉపనిషత్తులకు 'వేదాంత' మని వ్యవహారమేర్పడినది. భారతీయ తత్త్వజ్ఞానమునకు, ధార్మికసిద్ధాంతములకు, సంస్కృతి సంప్రదాయములకు ఉపనిషద్విజ్ఞానమే మూలము. ప్రస్థానత్రయమునందు ఉపనిషత్తులు మొదటివి. భగవద్గీత, బ్రహ్మసూత్రములు దీని తరువాత వెలసినవి. ఉపనిషత్తులు శ్రవణాత్మకములు. గీత నిదిధ్యాసనాత్మకము. బ్రహ్మ సూత్రములు మననాత్మకములు. ఈ మూడింటిలోను వివరింపబడినది బ్రహ్మజ్ఞానమే. కనుకనే యిది మోక్షవిద్య.

ఉప, ని, అను ఉపసర్గలతో చేరిన 'సద్' ధాతువు 'క్విప్' ప్రత్యయము నంది 'ఉపనిషత్' అను శబ్దమగును. ఈ ధాతువునకు విశరణ గత్యవసాదనార్థములలో ప్రయోగముండుటచేత ఉపనిషత్తనగా అవిద్యానాశనము (విశరణము), బ్రహ్మప్రాప్తి (గతి), గర్భనరక నివృత్తి (అవసాదనము) కలిగించు విద్య అని అర్థ మేర్పడును. 'నిషద్' అనగా కూర్చొనునట్టిది. 'ఉప' అనగా సమీపమని అర్థము. కాగా, పరమతత్త్వమునకు సమీపమున చేరి కూర్చొనునట్టి జ్ఞానమే ఉపనిషత్తు అని తేలును. వ్యవధానరహితమైన (ఉప) సంపూర్ణ (ని) జ్ఞానము (షద్) నిచ్చునదియు అట్టి జ్ఞానమును ప్రతిపాదించునదియు ఉపనిషత్తు అని పిల్వబడును.

ఉపనిషన్మహావాక్యకోశములో 223 ఉపనిషత్తులు పేర్కొనబడినవి. ముక్తికోపనిషత్తులో 108 ఉపనిషత్తులు లెక్కింపబడినవి. అడయార్‌లో 80 ఉపనిషత్తు లొక సంగ్రహముగా ప్రకటింపబడినవి. వీనిలో దారాషికోహ అను వదించిన ఛాగలేయాది ఉపనిషత్తులు కూడ చేరినవి. శంకరాచార్యులవారు పది ఉపనిషత్తులకు భాష్యము వ్రాసిరి. మరికొన్నిటిని గీతాసూత్రభాష్యాదులలో ఉదాహరించిరి. ముక్తికోపనిషత్తులో ముఖ్యములని చెప్పిన ఉపనిషత్తులు ఈ క్రింది పది మాత్రమే.

ఈశ కేన కఠ ప్రశ్నముండ మాండూక్య తిత్తిరిః,
ఐతరేయం చ ఛాందోగ్యం బృహదారణ్యకం దశ.

ఇవిగాక కౌషీతకీ, శ్వేతాశ్వతర, మైత్రాయణీయ ఉపనిషత్తులుకూడ ఆయా ప్రాచీన భాష్యకర్తల మతము ననుసరించి ప్రాచీనములుగనే వ్యవహరింపబడుచున్నవి. తక్కిన ఉపనిషత్తులు తత్తద్దేవతా విషయికము లును, తాంత్రికములును అగుటచేత అర్వాచీనములని భావింపబడుచున్నవి. ఆ యా ఉపనిషత్తులలో భాషాప్రయోగము, గద్యపద్యాత్మకమైన శైలి, వర్ణ్యవిషయములలోని జ్యౌతిషిక భౌగోళికాది సంకేతములు, మున్నగు నవి ఉపనిషత్తుల కాలనిర్ణయమునకు కొంత తోడ్పడుచున్నవి. అట్లే కేవల నిర్గుణబ్రహ్మప్రతిపాదకములైనవి మిక్కిలి ప్రాచీనము లనియు, విష్ణు, శివపారమ్యమును సూచించునవి మధ్యకాలమునకు చెందినవనియు, సాంఖ్య యోగతత్త్వములను పేర్కొనునవి అర్వాచీనములనియు, అల్లోపనిషత్తువంటి వింకను అధునాతనములనియు చెప్పబడినవి. ఏది ఎట్లున్నను ప్రాచీ నములని చెప్పబడు ఉపనిషత్తులు క్రీ.పూ. 2500-1800 కాలమునకు చెందినవనియు, బౌద్ధయుగమునకు పూర్వమే చాల ఉపనిషత్తులు వెలువడిన వనియు, శ్రీ శంకరబాలకృష్ణదీక్షిత్, పండిత బాలగంగాధరతిలక్ మున్నగు పండితుల అభిప్రాయము. అట్లే ఛాందోగ్య, బృహదారణ్యక, ఈశావాస్య, తైత్తిరీయ, ఐతరేయ, ప్రశ్న, ముండక, మాండూక్యోపనిషత్తులు మిక్కిలి ప్రాచీనములనియు, శ్వేతాశ్వతర, కౌషీతకీ, మైత్రాయణీయోపనిషత్తులు కొంతవరకు ఈ వెనుకటి కాలమునకు చెందినవనియు, కఠోపనిషత్తు ఈ రెండింటికి గల మధ్య కాలమునకు చెందిన దనియు పలువురి ఆశయము.

ఋగ్వేదమునకు చెందిన ఉపనిషత్తులలో కౌషీతకీ, ఐతరేయములు ప్రసిద్ధములు. కౌషీతకిబ్రాహ్మణములో సగభాగము అరణ్యకము. దానిలో ఆరవ అధ్యాయము కౌషీతకీ ఉపనిషత్తు. దీనిలో మొదట గార్గ్యాయని యను రాజు ఉద్దాలక ఆరుణికి పరావిద్య నుపదేశించినట్లు వర్ణింపబడెను. తర్వాత ప్రాణ విద్యయు, ప్రాణ ప్రజ్ఞాత త్త్వముల పరస్పర సంబంధమును వర్ణింపబడినవి: 'ప్రాణము జీవమునకు ప్రథమతత్త్వము. చైతన్య మా

తరువాతిది. ప్రాణమే ఆత్మకు ప్రతీకము. అదే జగత్తులోగల పదార్థము లన్నిటికిని మూలము. అదే వాటిని నడిపించు తత్త్వము, (3-4) అని వివరింప బడెను. చివర, కాశీరాజు అజాతశత్రువు బాలాకికి బ్రహ్మ విద్య నుపదేశించినట్లు వర్ణింపబడెను. బాలాకి సూర్యచంద్రవిద్యున్మేఘాకాశ వాయ్వగ్ని జలదర్పణచ్ఛాయాప్రతిధ్వని శబ్ద స్వప్న దక్షిణ వామ చక్షువు లలో వెలుగుతేజమే (పురుషుడే) ఆత్మ అనియు, అదే బ్రహ్మమనియు వాదించును. అజాతశత్రువు దీనిని ఖండించి, ఆ యా చోట్ల గల పురుషుని నిర్మించునదేదో అదే ఆత్మ అని నిరూపించును. 'య ఏతేషాం పురుషాణాం కర్తా, యస్య తత్ కర్మ, స వై వేదితవ్యః' అని, అట్టి ఆత్మయే తెలియదగినదని చెప్పి అతడు బాలాకికి బ్రహ్మవిద్య నుపదేశించును.

ఋగ్వేదీయమైన ఐతరేయబ్రాహ్మణములోని అంతిమభాగము అరణ్యకము. ఇది అయిదు భాగములు. వానిలో రెండవభాగములోని 4, 5, 6 అధ్యాయములు ఐతరేయోపనిషత్తు. దీనిలో సృష్టితత్త్వము వివరింపబడెను. శరీరములోని భిన్న భిన్న అవయవములలో ఆ యా అభిమానదేవతల ప్రవేశము వివరింపబడెను. మూర్ధమున పరమాత్మ ప్రవేశించుననియు, జీవ భావమున ఆత్మకు భూతములతో తాదాత్మ్యముండుననియు చెప్పబడెను. గురూపదేశ, గురుకటాక్ష సిద్ధులందిన పిదప సర్వవ్యాపకమైన శుద్ధబ్రహ్మ స్వరూప సాక్షాత్కారము లభించునని చెప్పబడెను. అంతిమాధ్యాయమున ప్రజ్ఞానమును గూర్చి చర్చింపబడెను. ప్రజ్ఞానమే అన్నిటికిని మూలమనియు, అదే సర్వోపాధివినిర్ముక్తమైన బ్రహ్మమనియు నిరూపింప బడెను.

శుక్లయజుర్వేదమునకు చెందిన మాధ్యందిన సంహితలోని 40 వ అధ్యాయములో ఈశావాస్యోపనిషత్తు గోచరించును. ఈశావాస్యమును శబ్దముతో ప్రారంభమగుటచేత ఈ ఉపనిషత్తును ఈశావాస్యమని వ్యవహరింతురు. ఇది 18 మంత్రములు మాత్రమేగల చిన్న గ్రంథము. అయినను గుణములో ఇది చాల మిన్నయని ప్రసిద్ధము. ఇది జ్ఞానదృష్టితో కర్మాచరణ మొనర్పవలె నని బోధించును. సన్యాసమునకు బదులు యావజ్జీవమును ఫలాపేక్ష విడిచి కర్మాచరణమునందు ప్రవృత్తి వహింప వలెనని యుపదేశించును. దీని ఆరంభశ్లోకములైన--

ఈశావాస్యమిదం సర్వం యత్కించ జగత్యాం జగత్।
తేన త్యక్తేన భుంజీథా మా గృధః కస్యస్విద్ధనమ్॥
కుర్వన్నే వేహ కర్మాణి జిజీవిషేచ్ఛతం సమాః।
ఏవం త్వయి నాన్యథేతోఽస్తి న కర్మ లిప్యతే నరే॥ (40/1-2)

అను నవి గీతకు మూల మనిపించును. ఈ ఉపనిషత్తులో అద్వైత ప్రతిపాదనముతో పాటు ఆత్మజ్ఞానమే విద్య అనియు, కర్మానుష్ఠానము అవిద్య అనియు వివరించి, 'అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయామృతమ శ్రుతే' అని కర్మాచరణ మూలమున మృత్యువును జయించి, జ్ఞానమూలమున అమృతత్వమందవలెనని చెప్పబడెను. (40-11) కారణరూప బ్రహ్మమును కార్యరూపజగత్తును తెలిసి వ్యవహరించినవాడు మృత్యువును (అసంభూతి) జయించి మోక్షము (సంభూతి) పొందునని వివరింపబడెను. (40-12-14).

శుక్లయజుస్సంబంధి వాజసనేయకణ్వసంహితలు రెండింటిలోను ఆఖరి అధ్యాయములు బృహదారణ్యకమని పిలువబడును. ఆరణ్యకము, ఉపని షత్తు కలసియుండుటచేత దీనికి ప్రథమాధ్యాయమున సృష్టితత్త్వము వివరింపబడెను. ద్వితీయాధ్యాయమున గార్గి అజాతశత్రులసంవాదము వర్ణింపబడెను. ఈ అధ్యాయములోనే యాజ్ఞవల్క్యునికథ తొలిసారి వినిపిం చును. యాజ్ఞవల్క్యుడు తన భార్యలైన కాత్యాయనీ మైత్రేయులకు ఆస్తి పంచిపెట్టి తాను సన్యసింపబోవును. తృతీయ చతుర్థాధ్యాయములలో ఈ యాజ్ఞవల్క్యుడు జనకుని సభలో గార్గి మున్నగువారితో వాదించి గెలిచి, తదుపరి జనకునితో బ్రహ్మవిద్యను గూర్చి చర్చించినట్లు వర్ణింపబడెను. ఈ సందర్భములో సృష్టి, పరలోకము మున్నగువాని తత్త్వములుకూడ చర్చిం పబడెను. యాజ్ఞవల్క్యమైత్రేయీ సంవాదము మరియొకసారి వినిపించును. పంచమాధ్యాయమున బ్రహ్మ, ప్రజాపతి, గాయత్రి మున్నగువారితత్త్వము వివరింపబడెను. షష్ఠాధ్యాయములో ప్రవహరణ జాబాలి శ్వేతకేతు ఆరుణే యుల సంవాదము వర్ణింపబడెను. దీనిలో పంచాగ్నివిద్య వివరింపబడెను. 'ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసి తవ్యో మైత్రేయీ' (4-5-6) అను ప్రసిద్ధోపదేశ మీ ఉపనిషత్తులోని మూర్ధన్య వాక్యము.

కృష్ణయజుర్వేదమునకు చెందిన తైత్తిరీయ బ్రాహ్మణములో అంతిమ భాగము ఆరణ్యకము. ఇది పది ప్రపాఠకములు. వీనిలో 7, 8, 9 ప్రపాఠకములకు తైత్తిరీయోపనిషత్తు అని పేరు. వీనినే వరుసగా శీక్షావల్లి, ఆనందవల్లి, భృగువల్లి అని వ్యవహరింతురు. శీక్షావల్లిలో ఓంకార, భూర్భువస్స్వః శబ్దముల నిరుక్తితోపాటు పరబ్రహ్మస్వరూపము నిరూపింపబడెను. ఆ మీద వరుణుడు తన కుమారుని కుపదేశించిన, 'సత్యం వద ధర్మం చర స్వాధ్యాయాన్మా ప్రమదః ఆచార్యాయ ప్రియ ధనమాహృత్య ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీః, సత్యాన్న ప్రమదితవ్యమ్, ధర్మాన్న ప్రమదితవ్యమ్' ఇత్యాదిగాగల మహోపదేశములు వినిపింపబడినవి (7-11) అట్లే 'మాతృదేవో భవ' పితృదేవో భవ, ఆచార్య దేవో భవ, అతిథిదేవో భవ, యాన్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని, నో ఇతరాణి' మున్నగు దివ్యోపదేశముల కీ ఉపనిషత్తు మూలము. (7-12)

కృష్ణ యజుర్వేద కఠశాఖకు చెందినది కఠోపనిషత్తు. ఇది మూడేసి 'వల్లులు' గల రెండధ్యాయముల గ్రంథము. నచికేతునికథ దీనిలో వినిపించును. నచికేతునికి యముడు బ్రహ్మవిద్య నుపదేశించును. 'నేహ నానాస్తి కించన' అని చెప్పి, పరబ్రహ్మ నిత్యుడనియు, చేతనుడనియు, అతడే సర్వాంతరాత్మ అనియు, యోగముచే నతడు ప్రాప్యుడనియు, తద్దర్శనమే పరమశాంతికి మూలమనియు దీనిలో వివరింపబడెను. (2-2-13) ఈ ఉపనిషత్తులో తొలిసారిగా విష్ణుపారమ్యము సూచింపబడెను.

ఇదే వేదమునకు చెందిన శ్వేతాశ్వతరోపనిషత్తులో శివపారమ్యము వర్ణింపబడెను. ఇది ఆరధ్యాయముల గ్రంథము. రెండవ అధ్యాయములో యోగ విషయములును, మూడు నుండి అయిదు వరకు గల అధ్యాయములలో శైవ, సాంఖ్య సిద్ధాంతములును వివరించబడినవి. ఆరవ అధ్యాయమున 'యస్య దేవే పరాభక్తిర్యథా దేవే తథా గురౌ' అని గురుభక్తి యుగ్గడింపబడెను. (6-23) ఈ ఉపనిషత్తులో వర్ణించిన సాంఖ్యము సేశ్వరసాంఖ్యము (6-10). అట్లే దీనిలో వర్ణించిన వేదాంతముకూడ మాయను స్పష్టముగా నిరూపించదు. 'అజామేకాం లోహితకృష్ణశుక్లాం' అని

త్రిగుణసామ్యావస్థారూపమైన ప్రకృతిని వర్ణించి (4-5) యీ ఉపనిషత్తు క్షర, అక్షరతత్త్వములను (1-10) శివపారమ్యమును (అమృతాక్షరం హరః) వివరించును.

సామవేదమునకు చెందిన కౌథుమబ్రాహ్మణములోని చివరి 8 భాగములకు ఛాందోగ్యోపనిషత్తని పేరు. మంత్రబ్రాహ్మణములోని రెండధ్యాయములు కలిపి దీనినే ఛాందోగ్యబ్రాహ్మణమని కూడ వ్యవహరింతురు. ఇది మిక్కిలి ప్రాచీనమైన ఉపనిషత్తు. బ్రహ్మజ్ఞాన ప్రతిపాదనములో ప్రౌఢప్రామాణికప్రమేయ బహుళమైన యీ గ్రంథమునందలి చివరి మూడధ్యాయములు అధ్యాత్మజ్ఞాన ప్రబోధకములు. తొలి అధ్యాయములలో ఓంకారతత్త్వము, ఉద్గీథవిద్య, యజ్ఞాచరణలౌల్యముపై వ్యంగ్యమును గోచరించును. మూడవ అధ్యాయమున మధు విద్య ఉపదేశింపబడెను, దీనిలో ఘోర అంగీరసుడు దేవకీపుత్రుడైన కృష్ణునికి బ్రహ్మవిద్య నుపదేశించినట్లు వర్ణింపబడెను. అధ్యాత్మ శిక్ష (3-27), అండములో నుండి సూర్యుని జన్మ (3-19) 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అను దివ్యోపదేశమును (3-14-1) ఈ అధ్యాయములో వినిపించును. నాల్గవ అధ్యాయమున రైక్వ, సత్యకామజాబాలుల కథలు వర్ణింపబడెను. అయిదవ అధ్యాయమున ప్రవహణజాబాలి, కేకయఅశ్వపతుల సంవాదములో సృష్టితత్త్వము వివరింపబడెను. ఈ అధ్యాయమున విభిన్నదార్శనికతత్త్వములు సమన్వయింపబడెను. (5/11-24). ఆరవ అధ్యాయమున ఉద్దాలక ఆరుణి తన పుత్రుడైన శ్వేతకేతునికి బ్రహ్మజ్ఞానముపదేశించిన కథ వర్ణింపబడెను. 'తత్త్వమసి శ్వేత కేతో' అను మహావాక్యమీ సందర్భములో వినిపించును. దీనిలో త్రివృత్కరణ, సృష్టితత్త్వాదులు కూడ వివరింపబడెను. ఏడవ అధ్యాయమున నారద, సనత్కుమార సంవాదము వర్ణింపబడెను. దీనిలో 'యోవై భూమా తదమృతమ్, అథయదల్పం తన్మర్త్యమ్' అని భూమాదర్శనము వివరింపబడెను. చివరి అధ్యాయమున ఇంద్రవిరోచనులకథలో ఆత్మసాక్షాత్కారమునకు గల వ్యావహారికోపాయములు సూచింపబడెను. ఈ ఉపనిషత్తులో ఈ జగత్తు బ్రహ్మనుండి ఉద్భవించి, అందులోనే నిల్చి, అందులోనే లీనమగుననియు, పురుషుడు కర్మమయుడనియు, కర్మ ఫలభోక్త అనియు, కనుక ధర్మమవశ్యాచరణీయ

మనియు ఉద్ఘోషింపబడెను. 'సర్వం ఖల్విదం బ్రహ్మ, తజ్జలానితి శాంత ఉపాసీత, అథ ఖలు క్రతుమయః పురుషః, యథాక్రతురస్మిఁ లోకే పురుషో భవతి తథేతః ప్రేత్య భవతి, స క్రతుం కుర్వీత' అనిచెప్పి, ఆ మీద ఆత్మస్వరూప, ఆత్మప్రాప్త్యుపాయములు వర్ణింపబడెను.

ఈ వేదమునకు చెందిన తలవకారశాఖకు సంబంధించినది కేనోపనిషత్తు. 'కేనేషితం' ఇత్యాదిగా ప్రారంభించుటచేత దీనికీపేరు వచ్చినది. దీనిని బ్రహ్మోపనిషత్తనికూడ వ్యవహరింతురు. ఇది నాల్గు ఖండములు. మొదటి రెండు ఖండములు పరబ్రహ్మతత్త్వమును నిరూపించును. వీనిలో ఉపాస్యబ్రహ్మ నిర్గుణబ్రహ్మల భేదము వివరించి, ఆ మీద బ్రహ్మరహస్య ముగ్గడింపబడెను. 3, 4 ఖండములలో ఉమా హైమవతీ ప్రసంగము ద్వారా పరబ్రహ్మ సర్వశక్తి సంపన్నుడనియు, దేవత లల్పసత్త్వులనియు నిరూపింపబడెను.

అథర్వవేదమునకు చెందిన పిప్పలాదశాఖకు సంబంధించినది ప్రశ్నోపనిషత్తు. దీనిలో ఆరుగురు ఋషులు పిప్పలాదునివద్దకేగి, 1. ప్రజోత్పత్తికేది మూలస్థానము? 2. ప్రజలను ధరించు దేవతలెందరు? వారెట్లు ప్రకాశింతురు? వారిలో శ్రేష్ఠుడెవరు? 3. ప్రాణోత్పత్తియు, శరీరమున ప్రాణప్రవేశ, తదుత్క్రమణములును ఎట్లు జరుగుచున్నవి? 4. స్వప్న జాగరణాదుల తత్త్వమెట్టిది? 5. ఓంకారోపాసనవలన గల లాభమేమి? 6. షోడశకలాపురుషుని తత్త్వమెట్టిది ? అని ఆరు ప్రశ్నలు వేయుదురు. వారి కతడిచ్చిన ఉత్తరములే యీ ఉపనిషత్తులోని వర్ణ్యవిషయము. ఈ ఉపనిషత్తు అక్షరబ్రహ్మను చక్కగా వివరించును.

ముండక మాండూక్యోపనిషత్తులుకూడ అథర్వవేదమునకు చెందినవిగనే చెప్పబడినవి. వీనిలో ముండకోపనిషత్తు అథర్వవేదీయ శౌనకశాఖకు చెందినది. ఇది మూడు భాగములు (ముండకములు), అవి తిరిగి రెండేసి ఖండములుగా విభజింపబడినవి. ఇది సన్యాసులకు (ముండకులకు) ఉద్దేశింపబడిన ఉపనిషత్తు. బ్రహ్మ తన జ్యేష్ఠపుత్రుడైన అథర్వుని కిది ఉపదేశించెను. యజ్ఞములు సంసారతరణమునకు పనికిరాని అదృఢప్లవ

సదృశములు. ఇష్టాపూర్తులు స్వర్గప్రాప్తి కలిగించినను, తిరిగి భోగానంతరము భూపతనము తప్పదు (1-2-10), అని యీ ఉపనిషత్తు బోధించును. ద్వైతవాదమునకు మూలమైన--

ద్వాసువర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే ।
తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్య
నశ్నన్నన్యోఽభిచాకశీతి ॥ (3-1-1)

అను శ్లోక మీ ఉపనిషత్తులో గోచరించును. ఈ ఉపనిషత్తు (3-2-6)లో 'వేదాంత' శబ్దము తొలిసారిగా వినిపించును. దీనిపై సాంఖ్య, వేదాంతముల ప్రభావము ఎక్కువగా గోచరించును. 'నదులెట్లు నామరూపాదులు విడిచి సముద్రములో లీన మగునో అట్లే జ్ఞానియైనవాడా పరాత్పరునిలో లయమగు' నని దీనిలో (3-2-8) వివరింపబడెను.

మాండూక్యోపనిషత్తు 12 వాక్యములు మాత్రమే గల చిన్న ఉపనిషత్తు. ఇది నాల్గు పాదములుగా విభజింపబడి ఓంకారపరముగా పరబ్రహ్మతత్త్వము నుపదేశించును. గౌడపాదాచార్యులవారు దీనికి కారిక వ్రాసిరి. శంకరుని అద్వైత వాదమున కిది మూలమని ప్రసిద్ధి.

మైత్రాయణీయోపనిషత్తులో సాంఖ్యయోగ విషయములు వర్ణింపబడెను. దీనిలో యోగము ఆరు అంగములు కలదిగా చెప్పబడెను. ఇది గద్యలో ఏడు ప్రపాఠకములుగా వ్రాయబడినది. మధ్య మధ్య శ్లోకములును, తక్కిన ఉపనిషత్తులలోని వాక్యములునుకూడ దీనిలో వినిపించును.

ఉపనిషత్తులన్నియు శాంతిపాఠములతో ఆరంభించి శాంతిపాఠములతో ముగియుచుండును. వేదాధ్యయన సమయములో కూడ శాంతిమంత్రములు పఠించు చుందురు. ఋషులు శాంతికాములు. ప్రశాంతమనస్కులై చిత్త స్థైర్యముతో గురుశిష్య లన్యోన్య సహాయమున పరతత్త్వము నుపాసించి లబ్ధకాములగు చుండిరి. ఆదిభౌతిక, అధిదైవిక, ఆధ్యాత్మిక తాపసము దాయ మంతయు శాంతించి, మనోవాక్కాయకర్మము లేక ముఖములై, లక్ష్యసిద్ధికి తోడ్పడవలెనను పరమాశయముతో ఇట్టి శాంతిపాఠములు పఠించు చుందురు.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

Price: Rs. 7/-
T.T.D.Religious Publications Series No.158

ఈ గ్రంథం...

విస్తృతమైన వేద వాఙ్మయాన్ని అధ్యయనం చేయడానికి ...

వేదవాఙ్మయ స్వరూప స్వభావాన్ని తెలుసుకోవడానికి...

ఋగ్, యజుర్, సామ, అథర్వణ వేదాలలోని విషయాల్ని విడివిడిగా గ్రహించడానికి ...

సంప్రదాయ పద్ధతితోనూ, ఆధునిక దృష్టితోనూ స్థూలంగా వేదాలపై అవగాహన కలగజేసుకోవడానికి ...

వేదవేదాంగాల విషయ వైవిధ్యాన్ని గ్రహించడానికి ...

వేదకాలంనాటి సాంఘిక, ధార్మిక, ఆధ్యాత్మిక అంశాల్ని ఆకళింపు చేసుకోవడానికి ...

ఒక్కొక్క వేదానికి ప్రధానమైన బ్రాహ్మణాలు, ఆరణ్యకాలు, ఉపనిషత్తులను గుర్తించడానికి ...

ఈ 'వేదావాఙ్మయం' కరదీపిక.

వేదవిషయాన్ని వింగడిస్తూ సులభగ్రాహ్యంగా డా॥ ముట్నూరి సంగమేశం గారు రచించిన గ్రంథం ఇది.

....చదవండి.

Printed and Published by Sri M.K.R.Vinayak, I.A.S.,
Executive Officer,T.T. Devasthanams & Printed at T.T.D. Press, Tirupati.